# సింధు మీద దండ యాత్ర

## చారిత్రిక విషయము-

సేకరణ వారణాసి శ్రీ రామ కృష్ణ.2-7-723

ఉమయ్యద్{Umayyad } అనే అరేబియెన్ తెగ వారు క్రీస్తు శకము 711 లో సింధు -- లేదా ఒక్కొక్క సారి హిందూ అని పిలవ బడే ప్రాంతము మీదకు దండ ఎత్తి వచ్చారు - అప్పటినుండీ ఈ కథ మొదలు అవుతుంది.[] ఈ సింధు ప్రాంతము - సముద్రపు తీరము కలిగి నేటి గుజరాత్ కి ఆనుకొని ఉండేది [] ,

ఉమయ్యద్{Umayyad } అనే ఈ అరేబియెన్ ప్రాంతీయులు మొహమ్మద్ ప్రవర్త యొక్క బోధనలనుఅనుసరించి జీవించే వారు . వీరు అరేబియన్ సముద్రము లోనుండి ప్రయాణించుకుంటూ వచ్చి భారత దేశమును దాటుకుంటూ , శ్రీలంక వరకూ వెళ్లి

వర్తక వాణిజ్యాలు చేసేవారు . ఇంత సుదీర్ఘ ప్రయాణములో సింధు ప్రాంతము వారికి అత్యవసర మైన విడిది ప్రాంతం గా మారింది [] మన విజాయవాడ too హైదరాబాద్ ప్రయాణం లో ఎదో ఒక హోటల్ వద్ద కాఫీ టిఫిన్ కి ఆగుతాము చూడండీ అట్లా అన్న మాట [] అయితే అప్పటి వరకూ అరేబియా నుండి హిందూ లేదా సింధుకు నేల మార్గాలు ప్రాచుర్యం లో లేవు - అంటే మార్గములు వున్నవి కానీ జనము వాటిని వాడుట లేదు [] అరేబియా వారు తమ విలువైన వ్యాపారపు సరుకుల

ను అరేబియా సముద్రముకుండానే ఎగుమతి దిగుమతులు జరుపుతూ ఉండేవారు [] నిత్యమూ తిరిగే ఈ అరేబియా ఓడల మీద "పైరేట్లు" అని పిలవబడ్డ - భయంకరమైన సముద్రపు దొంగలు దాడి చేస్తూ ఉండేవారు .[]

ఆ దొంగలు ఏర్పరిన నష్ట ము- కష్టము నుండి ఉద్భవించిన పరిస్థితుల వల్ల -- ఉమయ్యద్ అనే అరేబియన్ జాతి వారు ఒక రాయ బారి ద్వారా రాజా దహిర్ ని కలిసి " మీరు కనుక మాకు మా వర్తకంలో ను దొంగలను అణిచి వేయటంలోనూ తగిన సహాయము అందించితే -- మేము మీకు వత్తాసుగా నిలిచి, మీరు మీ శత్రువులను - ఆ సముద్రపు దొంగలను అణిచి వేయటానికి అవసర పడు సైన్యమును ఇస్తాము " అని ప్రతి పాదించారు[] ఈ ప్రతి పాదన అందుకున్నది సింధు ప్రాంతానికి రాజు అయిన హిందూ బ్రహ్మణ డు రాజా దహిర్. []

<> చారిత్రక నేపథ్యం <>

రాజా దహిర్ అంగీకరించటం వల్ల ఉమ్మద్ సైన్యము సింధు లేదా హిందూ ప్రాంతము లోనికి ప్రేవేసించింది .ఈ తరువాత -- వీరి ఉనికిని చూసుకొని- { అంటే అన్న వున్న వూరికి తమ్ముడు వచ్చి నట్లు } అరేబియా దేశాలలో తిరుగుబాట్లు చేసి రాజ్య బహిష్కరణ శిక్షకు గురి అయినా వారు- దొంగలు , మోసగాళ్లు వంటి వారు సైనికులుగా మారి సింధూ ప్రాంతానికి చేరుకున్నారు అని చెరిత్ర చెపుతోంది [] .వీరు ఎక్కడో ఒకక్కడ బ్రతికి వుండటము అంటే - పక్కలో బల్లేన్ని పెట్టుకొని పాడుకోవటమేనని - ఏనాటికైనా వారి వల్ల తమకు ముప్పు తప్పదు అని భావించిన అరేబియా పాలకులు - <>ఈ తిరుగు బాటు దారులను తిరిగి అరేబియా కి అప్పచెప్పవల సినది <> అని రాజా దహిర్ మీద ఒత్తిడి తెచ్చారు []అంతే కాకా వీరితో పాటు మేడ్స్ అని పిలవబడే -సింధూ జాతివారిని కూడా తమకు అప్పగించాలని డిమాండ్ చేశారు [] రాజా వారు దీనికి తిరస్కరించారు []

మెడ్ లు అనే తెగ వారు వారు ఎక్కడినుండో వచ్చి అప్పటికే సింధు ప్రాంతములో- నేటి గుజరాత్ లోని కచ్ అనే ప్రాంతంలో వున్న భారతేతర తెగలు [] వీరు ఓడలకు సంభందించిన నిర్మాణపు పనులు మరియు ఓడరేవుల పనులల్లో ఆరితేరిన తెగ [] అరేబియా దేశపు నౌకలు మరమ్మత్తులకు అని కచ్చి తీరాన్ని చేరినపుడు - వీరు ఆ ఓడల లో" గానా బజానా " కోసం వుండే ఆడవారిని తమ స్వంతం చేసుకుంటూ అరేబియా వారికి వారి ఆనందము దూరము చేసి - అరేబియా వారి శత్రు వర్గంలో చేరి పోయారు [] సముద్రపు దొంగల లాగా ఈ మెడ్ లు స్త్రీ దొంగలు అనుకోండి [] గానా బజానా నేర్చిఓడలో వినోద కాలక్షేపము ఇచ్చే స్త్రీని పోగొట్టుకోవటం అంత మజాకా కాదు . [] తదుపరి ఓడ ప్రయాణముపట్ల నావికులకు ఆసక్తి ఉండదు -- అదీ సమస్య [] అంతే కాకా ఒక నర్తకి ఒక నావికునకు ప్రేయసి అయ్యే వీలు కూడా వుంది [] నేడు , ఒక యువకుడు మరొక యువకుని పరుసులో నుండి అతని ప్రేయసి ఫోటోని దొంగిలించి దానికి పటం కట్టించి తన ఇంట్లో వేలాడదీస్తే

**- ఏమిటో? మరియు ఎంతనో ? ఇది అంతకు లక్షల రెట్లు గా వున్నది అని అరేబియన్లు ఫీల్ అయినారు అనుకోవాలి.[] అందువల్ల ఈ మెడ్స్ ను తమకు అప్పగించవలసినదేనన్న విషయం మీదా ఉమ్మద్ లు ఉడుం పట్టు పట్టారు . . దీనికి సింధు రాజు దాహిర్ తన వ్యతిరేకత తెలియ చేసారు [] .**

**[][]<>తమ దేశం లో తిరుగుబాటు దారులుగా ముద్ర బడి సింధులో తల దాచుకున్న తమ శత్రువులను స్వాధీనంలోకి తెచ్చుకోని వారిని దండింపాలని -- పనిలో పనిగా మేడ్స్ అనే వారిని కూడా తమ బానిసలను చేసుకొని - ఓడలు బాగు చేయటంలో వారికి గల నైపుణ్యాన్ని తమ స్వంతాని వాడుకోవాలన్న కోరిక ఎక్కువకాగా వీరు -- సింధు రాజు దహిర్ మీదకు, నేల మార్గాన దండెత్తి వచ్చారు . [] ఈ దండ యాత్రకు హజిబ్ అనే అతడు సారధ్యము వహించి , 6,000 Syrian కాలిబంట్లను , 6000 ఆస్వక దళంను , మరో 6000 ఒంటెల మీద వుండే సైన్యమును - మరో 3000 సరుకులు మోసే ఒంటెల తో ను సింధు పైకి దండ యాత్రకు వచ్చాడు [] ఇతని వెంట -- ఇతని మేనల్లుడు Muhammad bin Qasim అనే అతనుకూడా సింధు వచ్చాడు[] ఇతని స్వాధీనంలో వున్నా తుపాకీ సైనికి దళము వేరే ఒకటి, సముద్ర మార్గము మీదుగా సింధుకు వచ్చింది [].**

**<>ఈ దండయాత్రలోనే సింధు రాజు - చిట్టా చివరి స్వతంత్ర హిందూ-- బ్రహ్మణ రాజు రాజా దహిర్ ఓడింప పడ్డారు <>**

<<>>సింధు మీద దండ యాత్ర<<>> 31-7-23

మొదటి భాగము తరువాత గా వారణాసి శ్రీ రామ కృష్ణ చే రాయబడిన -రెండొ భాగము

.

[] సింధు మీద దండ యాత్ర లో రాజా దాహిర్ మీద - గెలిచి న తదుపరి ఇబ్రహీం ఖాసీం-- అనే సైన్యాధిపతి ఒడి పోయిన బ్రాహ్మణ రాజు దహిర్ స్థానంలోకి - అప్పటికే బ్రాహ్మణ జాతిలో సంపన్నులైన ఒక వ్యక్తిని రాజును చేసాడు .[] అంతే కాక అతనికి చెందిన బ్రాహ్మణులకు- గౌరవ పదవులు - మాన్యాలు - మాణిక్యాలు ఇచ్చాడు []

ఖాసీం ఈ రకముగా బ్రాహ్మణులను మాత్రమే ప్రోత్సహించటం బ్రాహ్మణేతర తెగలకు నచ్చలేదు [] చాలాకాలం పాటు బ్రాహ్మణులకు దొరికిన ఈ గౌరవం పట్ల ఇతర జాతుల వారికి అప్పటికే కంటగింపు ఉన్నది []

జాట్ అనే జాతి వారు - ముతక బట్టలు మాత్రమే ధరించి -- చెప్పులు అనేవి ధరించకుండా చేతులలో పట్టుకొని - కుక్కని ఒక దాన్ని వెంట

పెట్టుకొని తిరగాలని బ్రాహ్మణులు చేసిన నియమము ఒకటి వున్నది [] ఈ నియమము మరింత కఠినముగా అమలుపరచ బడింది [] **Qasim** - ఇచ్చిన ఈ సపోర్ట్ వల్ల- అప్పటి బ్రాహ్మణులకు, వారు పాటించే ఆచారాలకు మరింత ప్రోత్సాహం లభించి నట్లు అయ్యింది[]

పైరకము అయిన కఠిన ఆచారాల ఒత్తిడికి తిరిగి గురి అయినా వారు - యుద్ధములో ఓడిపోయినా సింధు రాజుయొక్క పాలన ఏ బాగున్నది భావించి అతన్ని బలపరిచారు . వీరిని తూర్పు జాట్లు అన్నారు [] పూర్వపు రాజు దాహిర్ పాలన కన్నాకూడా ఈ కొత్త వారి రి పాలన ఏ బాగున్నది అని భావించిన కొందరు - కొత్త రాజా లనే బలపరిచారు [] వీరిని పశ్చిమ జాట్లు అనేవారు[] వీరు -- రాజా దాహిర్ ని వ్యతిరేకించారు []
తూర్పు వున్నప్పుడు పడమర ఉండకు తప్పదు కదా ? అట్లాగా - కాసిం అజమాయిషీ లో వున్న రాజ్య ప్రజలు తూర్పు పడమరల లాగా విడిపోయారు []

అప్పుడు కాసిం బ్రాహ్మణాలు పట్ల తన కి గల ఉదార దృష్టిని గాలికి వదిలివేసి -- తన దృష్టిని, అలజడులు సృష్టిస్తున్న జాట్ తెగ వేపు మరియి లోహానా అని పిలవబడే మరో తెగ వైపు తిప్పాడు [] అప్పుడు కాసిం కి మరియు ఈ జాతుల మధ్య యుద్ధాలు జరిగాయి [] ఇప్పటినుండే హిందూ తెగల మధ్య , అరేబియానుండి వచ్చిన తెగల మధ్య యుద్ధము లు మొదలు అయినవి [] ఈ యుద్ధాలనుండీ అరేబియా వారి యుద్ధ ప్రీతిని - క్రూరత్వాన్ని హిందూ రాజులు - ప్రజలు గుర్తిచటం తప్పని సరి ఐయినది []

ఈ తెగల మీద యుద్ధాలలో విజయము పొందినాక కాసిం -- మిగతా హిందూ రాజులందరికీనీ --" మీరు మాకు లొంగి పోవాల్సినది - మా మతమును పాటించ వలసినది --" అని లేఖలు పంపాడు [] కానీ "నేను లొంగి పోతాను" అని సమాచారం ఇచ్చిన వారి మీదకు కూడా తన సైన్యాన్ని పంపేవాడు [] అప్పుడు సూరత్ ప్రాంతానికి రాజులైన వల్లభి మైత్రకాస్ **(Maitrakas of Vallabhi)** అనే వారు -- కాసిం తో శాంతి ఒప్పందానికి వచ్చారు [] కానీ కాసిం శాంతి ఒప్పందాలను పరిగణలోకి తీసుకోకుండా " అరేబియా లో వున్నా మా ప్రభువు నుండి - మీ మీద దాడి చేయవలసినది అని ఆజ్ఞలు అందినవి - మీరు యుద్ధమునకు రావాల్సినదే -- అని చెపుతూ కానూజ్ రాజ్యము మీదకు ఒక ఫదివేల సైనయముతో దండ ఎత్తి వెళ్ళాడు []

దీన్ని బట్టి మనము వారి యుద్ధ కాముకత్వాన్ని గ్రహించాలి [] ఈ కానూజ్ యుద్ధము ఫలితము ఏమిటో చరిత్రలో రాయబడలేదు []

కిరాజ్ అనే యుద్ధము జరిగినది అని మాత్రము లిఖించ బడి వున్నది [] హిమాచల్ నుండి కాశ్మీర్ కు దారి తీసే ప్రాంతాన్ని "కీరా" అనే పేరుతో హిమాచలీయులు పిలిచేవారు [] ." కీరా "అనగా లోయ అని వారి భాషలోని ఆ మాటకు అర్ధము [] ఈ కీరా యుద్ధమే కిరాజ్ యుద్ధము కావొచ్చును అని కొందరు అభిప్రాయం పడ్డారు [] ఆ తరువాత ఖాసీం స్వయంగా బయలు దేరి - పశ్చిమ పంజాబు ప్రాంతము వేపు వెళ్ళాడు [] అందువల్ల అంతకు ముందు జరిగినది కానూజ్ మీద కాదు అని - హిమాచల ప్రదేశ్ లో వున్నా కీరా వాలీ అయ్యివుంటుందని ఊహించ వలసి వచ్చింది [] ఇదిలా ఉండగా - ఈ కాసిం అను నతడు - అరేబియా లో ఉన్న తన ప్రభువు చేత వెనక్కి పిలవ బడినాడు [] ఇతని వెనక్కు పోవటంతో -- హిందూ రాజులందరూ తిరిగి తమ రాజ్యాలను చేజిక్కించుకున్నారు []

ఈ కాసిం అరేబియాకు తిరిగి వెడుతూ 715 వ సంవత్సరం లో దారిలోనే మరణించాడు [] ఖాసీం యొక్క ప్రభావము పూర్తి మూడు సంవత్సరాల పాటే హిందూ లేదా సింధు ప్రాంతం మీద ఉన్నది [] ఈ సమయములో అరేబియా కి ఖలీఫా అయిన రెండో ఉమర్ - కొంత ఉదార మైన మత స్వభావము గల మనిషి [] . ఈయన హిందూ రాజులందరికి నీ " మీబు పాలితులు - మీరు మా మతమునకు మారి మా సామంతులుగా వుండవల్సింది - అప్పుడు మేము మరింక మీ జోలికి మరింక రాము " అని కబురు పంపాడు [] దీనితో అప్పుడు సింధు ప్రాంతపు రాజులు - ఇతర రాజ పురుషులు తమ పేర్లను ఇస్లాం మతానికి అనుగుణంగా మార్చు కున్నారు [] భయం వారిచేత ఆ పని చేయించింది అనుకో వవల్సి వున్నది []

అరేబియా జాతుల వారు హిందూ ప్రాంతానికి వచ్చు దారిలో - అనేక జాతులు వారు వారితో కలిసి - మేమూ - ముస్లీములమే అని చెప్పుకుంటూ -- హిందూ దేశ ప్రవేశం చేసాబు [] అల్లాగా సింధు ప్రాంతానికి వేరు వేరు జాతుల వారు వచ్చి, సింధుకు అనేక నాగరికతలు పరిచయం చేశారు [] అరేబియావారితో పాటు వచ్చిన వారు కూడా - తమ పేర్లను ముస్లిం పేర్లగా మార్చుకున్నారు [] మన ము భ్రాతా దేశములో గమనించే భిన్న సంస్కృతులకు ఇదే మూలము [] క్రమంగా అప్పటి సింధు ప్రాంతములో ముస్లిం లు అధికము అయ్యి - ఏదో ఒక పదవిలో వున్న ముస్లిములు అత్యంత గౌరవము పొందారు - వీరు ఎన్నో సామాజిక మార్పులకు కారకులయ్యారు [] ముస్లింలలో అత్యంత గౌరము పొందినది ముస్లీము ప్రవక్తలు [] వీరిలో కొందరు భారతీయ ధర్మాలతో పరిచయం కలిగించుకొని - వాటిని తమ అరబ్ దేశం వరకూ తెలియ పరిచారు [] హిందూ ధర్మాల ఆధారంగా కొన్ని ఇస్లామిక్ న్యాయ సూక్తులు కూడా రాసారు []

అప్పట్టి నుండీ అరబ్బీల గురించి హిందువులకు - హిందువుల గురించి అరబ్బీ లకు తెలిసింది [] ఈ తెలుసుడు తరువాత కొందరు ముస్లిం రాజులు హిందూ ధర్మము పట్ల సానుకూల దృక్పదం ఏర్పరుచుకొని - మత సామరస్యాన్ని పాటించాఋ . అందువల్లే ఇస్లాముని - బలవంతముగా అమలు పరిచిన ప్రభువులతో పాటు - మత సామరస్యాన్ని పాటించిన పాలకులను కూడా మన చరిత్ర రుచి చూపింది []

ఇక్కడికి, రెండు భాగములుగా ఈ వ్యాసము సంపూర్ణము అయినది .